

ఓం

# శ్రీమదష్టోత్తర
# హనుమచ్ఛతకము

కవి

శ్రీ పాటిబండ్ల [illegible]దాసు

శ్రీ సీతయార్య వాఙ్మయ సమితి

[illegible]

[illegible]



# ఒకమాట



ఈ శతకము రచించినవారు శ్రీ పాటిబండ్ల వీరయ్యార్యులు. స్వగ్రామమగు వీపూండిబ్రాపాలెమున వేంచేసియుండు హనుమంతునిమీఁద తనకుఁ గల భక్తిరసోద్గారమే యీకృతి. 1908 సంవత్సరమున నియ్యది ప్రథమముద్రణమునందినది. ఇప్పటికి నాలుగేండ్లుగా నీ గ్రంథము మఱి కాన్పించక మఱుగుపడుచుండెను. మా సమితిపక్షమున నేటికిద్దాని మఱలఁ బ్రచురింపఁ గల్గితిమి. ఈ శతకముద్రణమునకు శ్రీ దాసరి పరిపూర్ణయ్య నాయుడుగారు మాకుఁ జేసిన

సాయమనల్పము. ఇట్లే యుదారాశయులెల్లరు నీ కవి వర్యుని యితర కృతులను గూడ నచిరకాలమున వెలువరించుటకుఁ దగు ప్రోత్సాహ మొసఁగుదురని యాశింతుము.

సత్తెనపల్లి.
2—11—1952.

బోడేపూడి వేంకటరావు,
కార్యదర్శి,
శ్రీ వీరయార్య వాఙ్మయసమితి



# శ్రీ మదష్టోత్తర హనుమచ్ఛతకము

శ్రీవసుధాత్మజ రాముల
సేవన్మెప్పించి తత్వసిద్ధుఁడవై నీ
సేవకుఁడను గీర్తించెదఁ
బ్రోవుము దీపాలదిన్నెపురవర హనుమా. 1.

శరణార్థిని రక్షింపుము
కరుణాకర నేరమెన్నఁగాదిర వినుమా
దురితముల నెల్ల బాపుము
వరదా! దీపాలదిన్నెపాలెపు హనుమా. 2.

నినుదలఁచిన భవరోగము
జను నంచును నార్యులెన్న•సరసోక్తులచే
గొనియాడెద నను గావుము
పనివడి దీపాలదిన్నె•పాలెపు హనుమా. 3.

భవవార్ధి దాటవచ్చును
భువనాత్మక నీదుపాద•ప్లాబ్జ నటంబున్
దవిలి వచింతురు ప్రాజ్ఞులు
పవనజ! దీపాలదిన్నె•పాలెపు హనుమా. 4.

వందనము మారుతాత్మజ
వందనమిదె భానుతేజ•వనచర రాజా
వందనము దళితదనుజా
వందనమిదె గొనుము వేడ్క•వరగుణ హనుమా. 5.

ఛందము తెలియఁగను సత్కవి
చందంబుల నెఱుఁగనీదు సత్కృప వలనన్
కందపముల గూర్ప దలఁచితి
సుందరముగ గొనుము భక్తసులభుఁడ హనుమా. 6.

వనరాశిదాటి జనకజ
గనుగొని రాక్షసులఁ ద్రుంచి గాకుత్థ్సునకున్
వినఁజెప్పిన నీమహిమను
గొనియాడగ వశమె దక్షగురునకు హనుమా. 7.

మ్రొక్కెద మీ పాదములకు
మ్రొక్కెద మీ తేజమునకు ముదము దలిర్పన్
మ్రొక్కెద మీ రూపమునకు
మ్రొక్కెద నామ్రొక్కు గొనుము ముదమున హనుమా 8.

ఆలింపుము నా మనవిని
జాలింపుము కోపమేల, సదయుఁడవగుచున్
బాలింపుము సత్కృప నను
దేలింపుము సౌఖ్యవార్ధి, దీనుడ హనుమా. 9.

అనిబడిన రాముతమ్ముని
వనజాప్తుఁడు రాకమును పె, వడి ద్రోణ గిరిన్
గొనివచ్చి బ్రతుక జేసిన
ఘనుఁడవు నీ మహిమలెన్న, కపివే హనుమా. 10.

లంకకు జని చొప్పునెడిన్
లంకను గాపాడినట్టి, లాపరివీవే
శంకలు మానిచి ప్రోవుము
సంకటహార జాలమేల, సదయుఁడ! హనుమా. 11.

నీరాటము నిను బట్టిన
బోరాటముజేసి దాని • బొరిపుచ్చి వెసన్
ధీరాటోపత రాముని
యారాటం బౌషధముల • నణచితి హనుమా. 15.

పదివేవురు కపులుండగ
సదయుండై రాముఁ డిచ్చె • జానకి వెదుకన్
కదలెడు తఱి నుంగరమును
ముదమున నీ కెంత పుణ్య • మూర్తివొ హనుమా. 16.

వననిధి గాంచియు భీతిలు
వనచర యూధంబుజూచి • వసుధాత్మజకై
చనివచ్చెద నే మీరలు
ఘనదుఃఖము మానుడన్న • ఘనుడవు హనుమా. 17.

రోగంబుల రాగంబుల
వేగము పరిమార్చినన్ను • వేడుక లలరన్
భోగినిగా యోగినిగా
సాగర గంభీరసేయు • శరణిదె హనుమా• 18.

సవినయముగ హనుమాయని
పవనాత్మజ యెవ్వడైన • భక్తియుతముగా
భువినొక్కసారి దలఁచిన
భవబంధము లడఁగునంద్రు • ప్రాజ్ఞులు హనుమా. 19

హనుమంతా హనుమంతా
హనుమంతా యనుచునిన్ను • వినయము భక్తిన్
గొనియాడిన మానవులకు
ఘనదుఃఖము దొలఁగజేసి • గాతువు హనుమా. 20

హరికమలాకరహంసా
వరతాపసనిచయహృదయ•వారిజహంసా
యరివర్గ భయదహంసా
పరమాత్మ నన్నుగావు•ధన్యుఁడ హనుమా 21

అరయఁగ బుట్టినాడే
సరసిజహితుఁ బంటఁబంపు•సంబరముల సం
బరమున కెగసిన నీకుం
కొరుఁడును నన్నృపుంబుగఁ గదె•యుర్విని హనుమా 22

పరమేష్ఠి మొదలుగాఁగల
సురలెల్లను నిన్ను జూచి•సుగుణుఁడననుచున్
వరముల నిచ్చిరి నాడే
కరుణాకర నీకుసాటి•గలరే హనుమా 23

దనుజారి భయదకేసరి
జనకజ దుఃఖాపహారి•శాంతాకారీ
నినునమ్మితి సామీరీ
ఘనుఁడవు నీసాటివారి•గానను హనుమా 24

అమరత్వమిచ్చె సురలకు
నమృతము సేవించుకతన•నటుగాకుండన్
అమరత్వ మిచ్చె నీకును
నమృతపు బ్రోవివెగాక•యౌరా హనుమా 25

రవికులునకు రవిజునకును
సవినయ స్నేహము నొనర్చి•జననాథునిచే
జవశాలి వాలినొక్కటి
నవనిని గూల్పించినాఁడ•వౌరా హనుమా 26

కుంజరుఁడనియెడు వానర
కుంజరకృత సుకృతఫలమొకో యనునటులన్
సంజననమంది బుధజన
పంజరమన దనరితౌర పవనజ హనుమా   27

లంకకు జని సీతన్గని
లంకాధిపు గాంచి మించి లాలితనీతుల్
పొంకముగ దెల్పి పిదపను
లంకాపురి గాల్చితౌర లావుగ హనుమా   28

చెడుతంత్రంబుల జెనటుల
గడువడి చెండాడి బుధుల గాతువు కరుణన్
దడయక నిను బేర్కొనినను
బొడవడగు బిశాచకోటి పుడమిని హనుమా   29

రోగంబు లెల్లబాపి ని
రోగినిగా జేసినన్ను రూఢిగ ధరలో
వేగమె బ్రోవక యుండిన
నీగురుడగు రామునాన నిజముగ హనుమా 30

'చండిగ్రహ మొండిగ్రహ
చండిగ్రహ' సమితినిన్ను దలంచిన మాత్రం
బెండువడి పాఱుదిశలకు
నుండవు నిను నుడువభయము లుర్విని హనుమా 31

చేసితి దుష్కర్మంబుల
జేసితి భాగవతహాని జేసితి నిందల్
చేసిన తప్పుల నెంచకు
భాసుర దీపాలదిన్నె పాలెపు హనుమా 32

హరు దుర్భర వీర్యంబున
హరివై జన్మించినాడ పటుగానున్నన్
హరిజాతి కీర్తిమహిమలు
హరిహరి యెందైనగలవె హరిశ్రీ హనుమా 33

ధర పాపి పరసవర్తన
నిరసించుక లేకతిరుగు నీచుని నన్నున్
బరమాత్మ బ్రోచితేగద
నిరుపమ సత్కీర్తిగల్గు నీకును హనుమా 34

దుర్భర సంసారగుహా
గర్భంబునజిక్కి దారి గానని నన్నున్
అర్భకు జనకువిధంబున
నిర్భయునిగ జేసిబ్రోవు నిరతము హనుమా 35

హరితనయు నిప్పుడోలిన
హరితనయులు గయుగరెంపు నదిమెట్లన్నన్
హరియైన రామచంద్రుని
కరుణకు నెలవైతిగాన ఘనుడవు హనుమా 36

శరనిధియు గట్టి లంకకు
గరువలియుత రాము జేర్చి కదనమునందున్
సురవైరి రావణాసురు
ధరణిని గూల్పించినావు తడయక హనుమా 37

నరులెవరేనియు నిను ను
స్థిరముగ సేవించరేని దినకరతేజా!
సిరిసంపదలకు దొలఁగియు
నిరుపమ సౌఖ్యంబునొంద నేరరు హనుమా. 38

దురమున దనుజుల గూల్చిన
కరణిని నా దుఃఖములను ఖండించి వెసన్
సిరులిచ్చియు బరమును సు
స్థిరముగ జేకూర్చుమయ్య దీనుఁడ హనుమా. 39

అరయంగ సువర్చలయను
తరుణీమణితోడఁగూడి తద్దయు వేడ్కన్
నిరుపమ సౌఖ్యము నొందెడు
కరుణాకర నాకు నీవె గతియగు హనుమా. 40

నాబోటుల రక్షింపను
నీబోటుల కొక్కపనియె నిర్మల హృదయా
కాబట్టి నన్ను బ్రోవుము
గాబారుల నణచి వేగ కరుణను హనుమా. 41

శరణన్న యనుజనముల
దురితంబులు పాపి ప్రోచు దొరవనుచును నే
శరణంటిని శరణంటిని
కరుణాకర నన్ను నీవు గావుము హనుమా. 42

"ఎందాక నుండు మీ కథ
లందాకను తనువు నిలుచు నటులను రామా
సుందరమగు మీపాదము
లందలి సద్భక్తి యొసఁగు" మనవే హనుమా. 43

బ్రహ్మర రాజ్య సుఖమ్ముల
దిమ్ముల బంధులను మిత్రతతి గనుటయు స
త్యమ్ముగ మారుతిసాహా
య్యమ్మననని రాముఁడు కొనియాడఁడె హనుమా. 44

నీ యట్టి సుతుని గాంచిన
నాయమ సుకృతంబు దెలుప నజునకు వశమా
వేయేల రాముగాంచిన
నాయమయే సాటివచ్చు నయ్యా హనుమా. 45

పొడుపుమల నొక్కయడుగున
బడమటి కొండందునొక్క పాదమునిడియున్
విడువక చదువులు దినమణి
కడజదివితివౌర యెంత ఘనుఁడవు హనుమా. 46

దివిజారి లంక లోపల
ప్రవిమల నీ దివ్యరూపు భాసురగతిగా
నవనిసుత కెఱుక సేయవె
భవహర దీపాలదిన్నె పాలెపు హనుమా. 47

అంజని వరపుత్రుని భవ
భంజను దీపాలదిన్నె పాటెవు వాయుస్
రంజను గొల్చెద రయమున
మంజులతరగాత్రు నిన్ను మదినిడి హనుమా. 18

రారా కేసరి నందన
రారా సంపూర్ణ రాజ రాజిత వదనా
రారానుత సంక్రందన
రారా తడవేలబ్రోవ రారా హనుమా. 49

దరి గానక తృష్ణాగ్నియు
దరికొని కాల్పంగ నీకు దాసుడ నంటిన్
దరి జేర్చవె హరివర నీ
కరుణామృత ధారనొసగి గ్రక్కున హనుమా. 50

రోగిని పాపిని దుఃఖిని
రాపట్యుఁడ మందమతిని కలుషుఁడ నన్నున్
చేపట్టుము శరణంటిని
దాపసమందార నీకు దాసుఁడ హనుమా. 51

అపరాధము సైరింపుము
నెపమెన్నఁగ నెంతవాఁడ నిర్మలమతి న
త్కృపజూడుము నీవానిగ
గపివర శరణంటి విగత కలుషుఁడ హనుమా. 52

ధీరత గోష్పదలీల
న్వారిధి లంఘించితౌర వసుధాత్మజకై
పేరియు వినువీధి న్ప్రాం
దారక సంస్తుతులు చెలగ పడయక హనుమా. 53

శ్రీరాముని దయచే నా
త్తారాముడ వైతివీవు మహిమాన్విత ని
న్నోరి భజించిన వారికి
జేసిన దే వల్ల పనము సిద్ధము హనుమా. 51

ఓ మారుతి వరపుత్రా
యోమానిత సచ్చరిత్ర యోశుభగాత్రా
యోమర్కటరాణ్మిత్రా
యోమైథిలి దుఃఖహర్త యోహరి హనుమా. 55

నను బ్రోచెడు పాపాత్ముడు
జనియించడు నిక్కమెపుడు జగతీ స్థలిలో
నినుజేరితి యమదూతల
ఘనతర బాధలకు వెఱవి గాపుము హనుమా. 56

తాఁ జన్మంబున జేసిన
ఫలమొందక తీరదెట్టి ప్రాజ్ఞులకైనన్
నలచక్రవర్తి యయినం
గలికాంతను బాసి గోడు గుడువఁడె హనుమా. 57

ఘనటికి పలువురు చెప్పిన
వినవొల్లక తుదకు దుఃఖ విపరీతుఁ డగున్
మును భీష్మాదులు చెప్పిన
వినక చెడఁడె కౌరవకుల విభుఁడిల హనుమా. 58

క్రోధము గాదది యెవరికి
గాఢిల కాలయముగాన కడద్రోయఁదగున్
మాధవుచే శిశుపాలుఁడు
క్రోధంబున గాదె కూలె కుంభిని హనుమా. 59

కాయము నిక్కంబనుచును
మాయా సంసారమందు, మున్నుఁ దగ్గి యు
న్యాయార్జనమున బెంచఁగను
దాయగ లేనైతి నట్టి, భ్రాంతుండ హనుమా. 60

పరధనముల పరిఖాతం
హరియింపగ గోరుచుండు, నతిరయమున నీ
చరణములను మరచియుంటఁ
గరుణ స్తృత్తియను భ్రాంతిఁ, గట్టుము హనుమా. 61

ప్రాయము చపల ప్రాయము
కాయము జలబుద్బుదమని, కనికని జనముల్
బాయంగజాలదు మోహము
మాయా సంసరణజేసి, మహిలో హనుమా. 62

అం గంధమాదనాచల
నిలయా కరుణార్ద్రహృదయ◆నిర్మలకాయా
పిలచినఁ బలుకవదేమయ
సలలిత సుజ్ఞానగేయ◆జయజయ హనుమా. 66

రాయము ధారుణి పాలనఁ
బ్రాయము బన్వోతలపాయ◆పసిడియుఁ గలుగన్
దాయల పాలగు నెదలోఁ
బాయని నీ సేవతనమ◆పాలగు హనుమా. 67

అనయము మిము సేవించెడు
ఘనులకు యముఁడన్న నడలు◆గల్గునె మదిలో
ఘనగజము నెక్కునాతఁడు
శునకంబులు గఱచు ననుచుఁ◆జూచునె హనుమా. 68

పరువంబున భ్రాంతుండై
ధరణీసుతరక్షకాలకుఁ,దాఁ జింతిలుచున్
వరియించును గపటంబున
దురితాలయు మగుచు మేలు,దోచక హనుమా. 75

ముసలియై సతిసుతులును
మదిరోయుచు నీసడింప,మమతాన్వితుఁడై
ముదిగానక వారలకై
మదినిశము గుందుచుండు,మందుఁడు హనుమా .76

తుదియైనను దనగతులను
మదిఁ దల పక సుతులనెవరు,మన్నింతురు న
న్వదలి యొక నిముసమోర్వరు
గదయని దుఃఖించు దుర్వి,కారత హనుమా. 77

రామునిదయ రాదాయెను
గామితములు దూరమాయె, గడుదుఃఖమునన్
భూమి చరించుట లాయెను
నామనవిని దెల్పురాము, నకు నిక హనుమా. 78

శరణంటిని నీవే నా
దొరవంటిని వినుము నాదు, దురితము లంటిన్
పరమంటిని నీ సేవయె
కరుణాకర ప్రోవుమంటి, గదరా హనుమా. 79

హరివందునో కాకను నర
హరివందునో నిన్ను దుఃఖ, హరు డందునో నే
గరువలిసుత వివరింపుము
అజ యేటికి నీవెదిక్కు, టంటిని హనుమా. 80

పాలనో నీళ్లనో ముంచుము
పాలును దను నేఁడు నీవు,పాలను బడితిన్
జాలము సేయుట గాదిక
మేలునకై నమ్మినాఁడ మేదిని హనుమా. 84

భూతోద్భవ భూతేశ్వర
భూతాత్మక భూతభావ, భూతాతీతా
భూతఘ్న భూతకారణా
భూతాలయ నన్ను వేగ, బ్రోవుము హనుమా. 85

జోహారు భక్తరక్షణ
జోహారిపు దార్త్తిహారణ,సుందర చరణా
జోహారు మంజు భాషణ
జోహారిదె నన్ను గరుణ, జూడుము హనుమా. 86

నతి జేసెద నుతి జేసెద
సతతము నీ నామమంత్ర • సంస్మరణము స
ద్గతియని చేసెద గావుము
యతులితబల శౌర్యసీమ • యయ్యర హనుమా. 87

రావణుపంపున వగ వై
రావణుఁ డరుదెంచి మించి • రఘువీరుల గొం
పోవఁగ వానిం దునిమియు
దేవే రవికులుల మగుడ • ధీరత హనుమా. 88

జననాథుల బలియిచ్చెద
ననియలరెడు దనుజు బట్టి • యక్కాళికకున్
మనమలరగ బలి యిచ్చిన
ఘనుఁడవు నీసాటి యెవరు • గలరే హనుమా. 89

కానివి చేసెద నంచును
మానసమును నింద్రియములు • మసలుచు దిరుగన్
గానిమ్మని మిముఁ జేరితి
దీనావన నీవె నాకు • దిక్కగు హనుమా.

పంచమహాపాపిని నీ
పంచను జేరితిని బ్రోవు • పావనచరితా
యించుకకృప జూచిన నా
పంచమహా పాపములను, బాయువె హనుమా.

నిద్దురచే స్త్రీపలవుం
గద్దరినై గడపినాఁడ • గలకాలంబున్
దద్దయు గృప నను బ్రోవవె
మద్దురితము లెల్ల బాపి • మహిలో హనుమా.

హనుమాయనెడి త్రివర్ణము
లను నొకమాఱెప్పుడైన నతిశయభక్తిన్
గొనియాడిన ఘాతంబులు
జనవే నల్గడలకడకు సరగున హనుమా. 93

సుజన శతపత్ర మిత్రున్
వృజినహరు స్వర్ణగాత్రు విమల చరిత్రు
న్నజముఖ దేవస్తోత్రున్
భజియించెద నిన్ను నేను భక్తిని హనుమా. 94

ఇలలోపల నను బోలిన
కలుషంబాక్రాంతుఁడు లేఁడు గతియేమగునో
దలఁచెద మీ పాపంబులు
కలుషంబుల త్రుంచినన్ను గావగ హనుమా. 95

హనుమంత వాయుతనయా
వనచర వరకీర్తిమంత వరగుణ నిలయా
దనుజాంతక దీనావన
యని నిను స్మరియించువాఁడ నయ్యా హనుమా.

అరితమ్ముఁడు శరణనఁగా
బరమాప్తుఁడు ప్రోవుఁడనుచు భానుకులునితో
నఱమరలేక వచించిన
కరుణాకర నీకు సాటి గలరే హనుమా.

దురమున మైరావణునిన్
సరగున దునుమాడి యతని జామాతకు సు
స్థిరముగ రాజ్యము నొసఁగిన
కరుణాకర మూర్తి వీవ కావే హనుమా.

భూతలి నీ శతకంబును
భూతంబులు సోకి దుఃఖ మొందెడి జనముల్
బ్రాతిగ బూజించిన నా
భూతములే దుఃఖమొంది పోవును హనుమా. 99

చెప్పితి మీకృపచేతను
దప్పొప్పులు నెరుఁగనయ్య దైవలలామా
తప్పేమగు మీస్మరణకు
నప్పా నన్నేలు మయ్య యఘహర హనుమా. 100

దీపాల దిన్నెయందున
ప్రాపై సద్భక్తవరుల పాలించుటకై
తాపసనుత నిలచితివొ
జేపట్టుము నన్ను శరణు జేసెద హనుమా. 101

ధర బాపయ సుబ్బమలకు
వరపుత్రుఁడ పాటిబండ్ల వంశోద్భవుడన్
గరుణించు వీరయాఖ్యుఁడ
గరువలిసుత వేఁడువేయు గాదిక హనుమా. 102

పులహరి పీర్దేశిక వరు
విలసత్కృప నొందినాఁడ వేడుక లలరన్
లలితంబుగ జెప్పితినిటు
వలదిక దప్పొప్పులెన్న వాయుజ హనుమా. 103

కందంబులు గూర్చితిమీ
కందంబగు హారముగను నదిగొనియును మీ
కంధరమున ధరియించియు
గంధక యుండంగ నన్నుఁ గావుము హనుమా. 104

మంగళము మారుతాత్మజ
సంగరజయ భానుతేజ, సద్గుణనిలయా
మంగళము భక్తవత్సల
మంగళమిదె కొనుము వేడ్క, మహిలో హనుమా.

మంగళము సుగుణగణజయ
మంగళ మనిలాత్మజన్మ, మంగళమభవా
మంగళమిదిగో కొని కపి
పుంగవ సత్కరుణ నన్ను, బ్రోవుము హనుమా. 106

మంగళము సంగరహితా
మంగళమానందరూప, మానితచరితా
మంగళమిదె గైకొనుమో
మంగళకర వేడ్క నిత్తు, మానుగ హనుమా. 107

పుడమిని నీశతకంబును
గడుభక్తిని జదువ వినిన(ఁ)గొంతురు వారల్
కడుసంపదలను సిరులను
గడకును గైవల్యపదవి(ఁ)గలుగును హనుమా. 108



శ్రీ మదాంజనేయార్పణమస్తు.

సంపూర్ణము.

---

ప్రభాత్ ప్రింటర్స్, రేపల్లె.